సంపుటము 5] అక్టోబరు, 1918 [సంచిక 4

# బాలమిత్ర

## మిరెపకాయ పాట

బిలహరి—రాగము | రూపక—తాళము

రండు రండు కొనగ మీరు పండు మిరెపకాయలు
పండు మిరెపకాయలు లావైన మిరెపకాయలు
రంగైన మిరెపకాయలు. ॥ రండు ॥

2. నిండుగా గంపలందు నింపినాము కాయలు
తువుక్ తువుక్ తువుక్ తువుక్ తుమ్ములెడలు
బాలులార కదపినఁ. ॥ రండు ॥

3. మిన మిన మిన మిన మిన మిన మెరయు మిరెపకాయలు
కొన గొరికిన చుర చుర చుర జుట్టుకెక్కు మంటలు. ॥ రండు ॥

4. నిగ నిగ నిప్పులవలె నీట గులుకుకాయలు
భగ భగ భగ భగ కనులమంట బాలురార
కదపినఁ. ॥ రండు ॥

# గర్వించిన ఉంగరపువ్రేలు



బొటనవ్రేళ్లును, తక్కినవ్రేళ్లును చాల సంతోషముగా కాలము గడుపుచుండెను. అవి ఒకదానికొకటి సహాయము జేసికొనుచు, ఒకరిమేలొకరు చూచుకొనుచుండిరి. అన్నిటికంటె బొటనవ్రేలెక్కువ సహాయకారియై యుండెను.

ఒకనాడు ఎవరో ఒకరు ఉంగరపువ్రేలుకు ఒక చక్కని బంగారు ఉంగరమును పెట్టిరి. దానికి చక్కని ప్రశస్తమైన రాళ్లు పొదిగింపబడెను. దానిని చూడగానే ఉంగరపువ్రేలు బహు గర్వించెను. ఇకను తక్కిన వ్రేళ్లతో సరిగా మాటలాడలేదు. ఉంగరమును చూచుకొనుటతోనే ప్రొద్దుపోయినది. ఇదంతయు ఉదయమున జరిగినది.

సాయంకాలమున అన్నియు కలిసి తోటలోకిపోయినవి. తోటలో మంచి మంచి పండ్లును పువ్వులు నుండెను. ఉంగరపువ్రేలు ఒకపండును కోసికొనవలెనని కోరినదిగాని స్వయముగా కోయలేకపోయెను. పువ్వునుకూడా కోరెను గాని ఒకటే ఏలాగు కోయగలదు, సహాయముచేయుమని తక్కిన వాని నడుగ దాని కిష్టములేకపోయెను. తక్కిన వ్రేళ్లు బహు సంతోషముగా కాలము గడుపుటచూచి దీనికి కడుపు మంటయెత్తినది. తనకు ఉంగరమున్నది లే అని అనుకొన్నదిగాని మనస్సుకు నెమ్మదిమాత్రము లేకపోయెను. రాత్రులలో నది పగటిలోవలె మెరవలేదు. దాని మనస్సుకు చాల విచారము కలిగినందున అది మెల్లగా చిటికెనవ్రేలితో తన విచారమును తెలిపినది తరువాత పెద్దవ్రేలికికూడ చెప్పినది. పెద్దవ్రేళ్లు చూపుడువ్రేలుతోను, చూపుడువ్రేలు బొటనవ్రేలితోను చెప్పెను. అప్పుడన్నియు ఈ వ్రేలునుముద్దుబెట్టుకొని జరిగిన సంగతిని మరచిపోయి ఎప్పటివలె సంతోషముగా నుండెను.

---

## ఒక నీతికథ

ఒకానొకప్పుడు ఒక బోయవాడుండెను. అతనివృత్తి పిట్టలను వేటాడుట. అతనికి దేవుడున్నాడను మాటయే తెలి

యుండెను. బహు మూర్ఖుడు. అతడొక దినమున అడవికి వెళ్లి పిట్ట లకై వలను వేసి ఒక చెట్టుక్రింద కూరుచుండెను. వెంటనే పెద్దగాలియును, వర్షమును వచ్చెను. అంతట వానిబట్టలన్ని యును తడిసిపోయెను. వానికి చాలా ఆకలియగుచుండెను. అతని యిల్లు చాలా దూరముననుండెను. అతడు తన యింటికి వెళ్లుటకు శక్తిలేనివాడైయుండెను. వానికి చలిబాధ మెండుగా నున్నందున వానికి తాళలేక, "ఈ చెట్టుమీదనున్న భూతము లారా! నాకు సహాయము చేయుడని" మొర్రబెట్టెను. ఆ చెట్టుతొర్రలో ఒక మగపక్షి తనసతి, మేతకు బోయి రానందున దుఃఖించుచుండెను. ఆడుపక్షి ఈ చెట్టుక్రిందనున్న బోయవానివలలో జిక్కుకొనియుండెను. అప్పుడది తన భర్తతో, "నీవు నాకొరకు దుఃఖించక ఆ చెట్టుక్రింది మను ష్యునకు సహాయము చేయుమని" చెప్పెను. ఆ మగపక్షి ఆ చెట్టుక్రిందనున్న వానితో, "అయ్యా! నీకేమి కావల యును?" అని యడిగెను. అప్పుడతడు, "అమ్మా! నాచలి బాధతీర్పుమని" చెప్పెను. అంతట ఆపక్షి చెంతనున్న గ్రామ ములోనికి బోయి ఒకపుల్లను సగము కాల్చుకొని తెచ్చెను. తరువాత అది ఆ చెట్టుమీదనున్న ఎండుపుల్లలను విరిచి తన రెక్కలతో విసరిమంటచేసెను. అప్పుడా బోయవాడు తన చలిబాధ తీర్చుకొని తన బట్టలనుగూడ ఆర్చుకొనెను. అతడు

ఆ కొంచెము మేలుతో తృప్తిపొందక, "అన్నముకూడ పెట్టు మని" యడిగెను. అంతట ఆ పక్షి తనయొద్ద అతనికి పెట్టుటకు ఆహారము లేదని చూచి తన రెక్కలతో ఆ మంటను పెద్ద దానిగజేసి తనను తినుమని ఆ మంటలో బడి వ్రాలినొందెను. అప్పుడతడు మారు మనస్సునొంది వలయొద్దకువెళ్లి వలలోని పక్షులను వదలివేసి యింటికి వెళ్లెను గనుక సహోదరులారా! ఈ కథవలన నేర్చుకొనవలసిన నీతులేవనగా ఆ మగపక్షి మనము యితరులకు చూపవలసిన మాదిరిని వానికి చూపి వాని మనస్సును ఏలాగున మార్చినదో ఆలాగుననే క్రైస్త వులమైన మనము దేవుని సంగతులు తెలియని మూఢులకు మాదిరిగానుండి వారిని రక్షణకట్టు త్రిప్పవలయును.

ఈ పక్షి ఆ మనుష్యునికొరకు తన ప్రాణము ఏలాగు పెట్టి నదో ఆలాగుననే క్రీస్తు మనకొరకు తన ప్రాణమును బెట్టెను గనుక మనము ఆయనకు ఏమియు దానికి ప్రతిగా యివ్వ లేము. అయినప్పటికిని మన హృదయములు ఆయనకు సమ ర్పించుకొనెదము. ప్రభువునకుగూడ అదేకోరిక.

ఇట్లు
మీ బుధజన విధేయుడు
గడ్డము మత్తయ్యా
పాస్టరు



# కమ్మరివాని కార్ఖానా

ఒక గ్రామములో నొక మంచి కమ్మరివాడు గలడు. చిన్నతనమునుండియు కష్టపడి పనిజేసి యుండినందున వానికి మంచిపేరుమాత్రమేగాక, మంచి బలముకూడ కలిగెను. తాను పనిచేయు స్థలము నతి జాగ్రతగాను, శుభ్రముగా నుంచేవాడు.

ఇట్లుండగా ఒకనాడు వాని కార్ఖానాలో నున్న పనిముట్లలో నొకదాని కొకటికి సరిపడక పోట్లాడుకొన నారంభించెను.

“నేను లేకపోతే ఈ కార్ఖానాలో ఏ పనియు జరుగదు. నేను మండకపోతే ఈ కార్ఖానాను తీసివేయవలసినదే” నని నిప్పు కోపాగ్నితో మండుచు చెప్పెను.

"సరె, సరె నేను ఊదకపోతే, నీ వేలాగు మండగలవు, అన్నిటికి నేనే ముఖ్యము" అని తిత్తులనెను.

"నీవు ఊదినా, నిప్పుమండినా, నేను కొట్టకపోతే ఏపనియు సాగ"దని సమ్మెట చెప్పెను.

"నేను పట్టుకొనకపోతే ఏలాగు కొట్టగలవు?" అని పటకారు ప్రశ్నించెను.

ఈ విధముగా ఆ కార్ఖానాలో నున్నవన్నియు తమ్మును ముందు వేసికొని, తామే అక్కడ లేనియెడల ఆ కార్ఖానా నెత్తివేయవలసిన దన్నట్లుగా కేకలువేయుచు తారుమారుగా జేసెను.

వీ టన్నిటి సహాయముచే చక్కగా నమర్చబడిన ఒక నాగలి, "తాళండి, నా స్నేహితులారా! కొంచె మాగండి. ఇక్కడ పనిజేయునది మీలో ఒక్కొక్కరే కాదు, గాని అందరిచేరికవల్ల జరుగుచున్నవి. అందరు తమతమ సాధ్యమైనది చేసినప్పుడే అన్నిపనులును క్రమముగా జరుగును" అని పలికి బుద్ధి చెప్పెను.





# మొక్కలకు మిత్రులగు జంతువులు
# శత్రువులగు జంతువులు

శత్రువులు:—వత్సపురుగులు రోకలిబండ, జమిడిజలగ పురుగు, నత్త, లద్దిపురుగులు అనునవన్నియు భూమిలో వేళ్లదగ్గఱచేరి మొక్కలకు హానిగలిగించుచున్నది.

కొన్ని పురుగులు ఆకులను పాడుచేయును. వానిలో చీడ పురుగులు ముఖ్యములు వీనిలో అనేకతెగలున్నవి.

ఎఱ్ఱ సాలీడు మిక్కిలి చిన్నదిగానుండి ఆకుల యడుగున గూడు పెట్టుకొనును. గొంగళి పురుగులో ననేక రకము లున్నవి. ఇవియును ఆకులను బాడుచేయును.

కీటకములు మాత్రముగాక కొన్ని పక్షులు, ఎలుకలు నక్కలు, కుందేళ్లు మొదలగునవి కూడ పాడుచేయును.

2. మిత్రులు:—వానపాము నేలను గుల్లచేసి మొక్కలకు సాహాయ్యము చేయును. భూమిలో నివసించు పేడ పురుగు వత్స పురుగులను దినును. కనుక అట్టి పేడ పురుగులను చంపరాదు. ఇట్లే మొక్కలకు హాని చేయు పురుగులను తిను కీటకములున్నవి. కొన్ని పక్షులు పనికిమాలిన గడ్డివిత్తనములను దినివేయును. ఇవియు మొక్కల యొక్క మిత్రులే. పిల్లులు బల్లులు గోదురుకప్పలు మొక్కలకు హానిచేయు జంతువులను కీటకములను నాశనము చేయుటవల్ల మొక్కలయొక్క మిత్రులని చెప్పవచ్చును.



# ఇతరుల మేలు వెదకుట

ఒకానొకప్పు డొక ముసలివాడు ఒక చెట్టును నాటుచుండగా ఒకరు వచ్చి అయ్యా నీవు వృద్ధుడవు, నీవు

దాని ఫలము లనుభవించవే, నీవెందుకు దాని నాటుచున్నా వని అడిగినప్పుడు, ఆ వృద్ధుడు, నేను పుట్టకముందు యెవరో యొకరు నాటిన చెట్ల ఫలము లనుభవించితిని గదా! అటు వలె నేను నాటిన చెట్టుఫలము లితరు లనుభవించగోరి యీ ప్రకారము నాటుచున్నానని చెప్పెను. ఇదియే పరులకు మేలు వెదకుట.

---

## గుడ్లగూబ

గుడ్లగూబలకు గుండ్రని పెద్ద తల ఉండును. వాటి కండ్లు పిల్లికండ్లవలె నుండును. వాటి ఈకలు బహు మృదువుగానుండును. గనుక నవి యేమాత్రము ధ్వనియయినను చేయకుండా నెగిరి వాటి ఆహారపదార్థములను బహు అకాత్తుగా పట్టుకొనగలవు. అవి యేమాత్రపు ధ్వనినైనను వినగలవు. క్రిందనుండెను ఆకులలో యేమాత్రము చప్పుడైనను తనకు ఆహారము దొరకునని అవి క్రిందకు దిగును.

ఇవి తమ ఆహారమైన ఎలుకలను చుంచులను రాత్రివేళలందు వెదకును. వాటి పెద్దకండ్లతో నవి యేమాత్రపు కొద్ది



వెలుతురున్నను చూడగలవు. కాని సూర్యునికాంతివల్ల వాటి కండ్లు చీకటి కమ్మును గనుక నవి యెండలో బాగుగా చూడలేవు. ఎంతో వెళ్లవలసిన అవసరము ఉంటేనేగాని యవి పగలు బైటికివెళ్లవు. చిన్నపక్షులు వీటిని పొడవ జూచును ఇవి నాటినుండి తమ్మును కాపాడుకొనవు.

ఇవి యొక ఎలుకనుగాని చుంచునుగాని ఒక్కసారిగా మ్రింగును. తరువాత వాటి యెముకలను వెళ్లగ్రక్కును. పక్షులను చీల్చి ముక్కలుగా తినును. ఇవి కోపముగానున్నపుడును భయపడినపుడును దాని ముక్కును కొట్టి పిల్లిచేయు ధ్వనివలె బుస్సుమను నొక ధ్వనిని చేయును. పెద్దగుడ్ల

గూబను అడ్డగించినయెడల దాని ప్రాణము పోవునంతవరకు అది వెల్లకిలగా పడి గోళ్లతోను ముక్కుతోను పోట్లాడును.

గుడ్లగూబ తన పిల్లలవిషయమై చాలా శ్రద్ధపుచ్చు కొనును. పిల్లలుగల యొక గూటిని ఎవరైనను తీసికొని పోవుచున్న యెడల పెద్దపక్షులు మేతతెచ్చి పిల్లలవెంట వెళ్లును. ఒక చిన్న గుడ్లగూబ యొక కోళ్లగూటిలో నుంచబడెను. ప్రతి రాత్రియును అందరు పరుండినతర్వాత తల్లిదండ్రులు యొక ఎలుకనుగాని చుంచునుగాని తెచ్చి వాటి పిల్లలకు గూటివద్దపెట్టునవి. ఈలాగున ఆపిల్ల తనంతట తాను ఆహార మును సంపాదించుకొనగల శక్తి వచ్చునంతవరకు అవి పెట్టెను.

గుడ్లగూబలలో 70 జాతులవరకు కలవు. వాటిలో కొన్ని పెద్దవిగాను కొన్ని చిన్నవిగాను ఉండును, వీటిలో ముఖ్యమయినజాతులు రెండు. అవి కొమ్ములుగలవి కొమ్ములు లేనివి. వీటిలో మొదటిజాతికి తలమీద ఈకెలు ముందుకు ఒరిగియుండును.

తెల్లగుడ్లగూబ చెవుల పిల్లులను సహితము పట్టుకోగలిగి నంత పెద్దదిగా నుండును. ఇది చాలా బలముగలిగి ధైర్య ముగానుండును గనుక కాపువానికి యిది అనేక పిల్లులు చేయు మేలును చేయును.

గుడ్లగూబ గంభీరముగా చూచును కనుక గ్రీకుదేశస్థులు దానిని తమలో జ్ఞానమున కధిదేవతయైన మినర్వయొక్క పక్షి అని యెంచెడువారు.

అనేకమంది మూర్ఖులు దీనికూతను చెడు శకునముగా తలంచుదురు. ఇది తెలివిలేనిదిన్ని నిజముకానిదియును అగు భ్రమ. గుడ్లగూబలకంటె నుపయోగకరమైన పక్షులు వేరే లేవు. సేద్యమునకు హానిని గలుగజేయునట్టి ఎలుకలను చుంచులను అనేకములను ఇవి చంపును.

---

## బాలమిత్ర టపా

ప్రియబాలమిత్రులారా!

మేము మీతో నొక సంతోషకరమైన మాటను, మనకుల్లాసము గలిగించుమాటను చెప్పబోవుచున్నాను. అదే దన క్రీస్తుప్రేమ.

తెనాలి. ఎ. యి. ఎల్. ఎమ్ కాంపౌండుస్కూల్ హిందూ బాలురమైన మేము సెప్టెంబరు 15 వ తేది ఆదివారము




ఉదయము 8 గంటలకు మామూలుగ సబ్బాతు బడిపాఠములు నేర్చుకొనుటకు కూడియుంటిమి. ఇంతలో మా స్కూలునందు బైబిలుమాస్టరుగానున్న సున్నపు వెంకటరత్నముగారు వచ్చి ఈ రోజు సబ్బాతుబడిని దర్శించుటకుగాను క్రొత్తదొరసానిగారు వచ్చుచున్నారని సెలవిచ్చిరి. మే మా దొరసానిగారినిచూడ వేచియుండ మా మానేజరుగారగు రివరెండు. జి. రేమండు, హాఫ్ దొరగారు రైలుస్టేషనువద్దకు ఎదురేగి వారిని దోడ్కొనివచ్చిరి. వెంటనే మేము ఆమెగారికి వందనము లాచరించితిమి. ఈ రోజున సబ్బాతు బడివిషయమునుగూర్చి ప్రసంగించునని శ్రీమా దొరగారు మాకు

సెలవిచ్చిరి. అంతట మే మా మంచి ప్రసంగమును వినుట కుద్యుక్తులమైయుండ ఆమెగారు లేచి మమ్ములను రెండుపుడకల నడిగి తీసుకొని ఆ పుడకలను † సిలువ నాకారముగ నుంచి తన నెడమచేతనిడుకొని యీ క్రిందిమాటలతో మాకు సంతోషము కలుగునట్లు నుచ్చరించెను. "బాలు రారా! ఇట్టి సిలువగురుతుగల మ్రానుమీద చనిపోయినవారు క్రీస్తు. ఈయన సర్వజనులను సైతాను కొలువునుండి తప్పించవలయునని మన పాపములకొరకు ఈ నీచమైన సిలువ మరణమును పొందెను. ఈ సిలువ క్రీస్తుయొక్క శ్రమ, ప్రేమను సూచించుచున్నది. ఈ లోకములో అనేకమంది నేను మిమ్ములను ప్రేమించుచున్నాను అని చెప్పవచ్చును. కాని, శ్రమలేనిప్రేమ వట్టిది. క్రీస్తు జనులను ప్రేమించుచున్నాడని లోకమునకు తెలియుటకై ఆయనప్రేమ నీచమైన సిలువమరణమువలని శ్రమవలన బయలుపడెను. ఆలాగే మీరును, ఒకరినొకరు ప్రేమించుచు, ప్రేమతో కూడుకొనిన వారైనయెడల ఆ ప్రేమను మీసహోదరునియొక్క కష్టసుఖములలో పాలుపొందుచు బయలుపరచుడి.

ఇట్టి సంతోషకరమైనమాటను బోధించినవా రెవరని మీరడుగవచ్చును. ఈమెగారు క్రీస్తుసేవకురాలైన కెన్నడి దొరసానిగారు, ఈమెగారు కొద్దికాలములోనే మన దేశ

భాషను బాగుగ నేర్చుకొని ఎంతో ముచ్చటగా మాటలాడిరి. ఈమెగారు ఇట్టి సంతోషకరమైన మాటను, ఉల్లాసము కలిగించు మాటను ఇచ్చినందులకు మనమందరము మన హృదయపూర్వకముగా వందనములు చెల్లించుటయే గాక ఈ దొరసానిగారిపనిని ఆశీర్వదించగలందులకు మేము దేవుని వేడుకొనుచున్నాము గాన మీరును ఆలాగే చేయుడి.

ఇట్లు

మీ ప్రియ బాలమిత్రులు

5 వ తరగతి బాలురు

ఏ. యి. ఎల్. ఎమ్. కాంపౌండుస్కూల్

తెనాలి

నాజరుపేట

C. L. S. PRESS, MADRAS—1918